# ఆంధ్రపత్రిక

3191194

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 6 FOUNDER DESODHARAKA K NAGESWARA RAO శుక్రవారం 6-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా

# రాష్ట్రం కొత్తది అంటే ఆంధ్రలో మళ్లీ ఎన్నికలు జరుగుతాయనా?

## సమాజభీమాకు తరుణం వచ్చిందని కార్మిక మంత్రి భావం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 4 కార్మికులకు సంబంధించిన శాసనాలన్నిటినీ చేర్చి సమగ్రమైన శాసనాన్ని ప్రవేశపెట్టి, సామాజిక భీమా కార్యక్రమాన్ని ప్రవేశపెట్టే తరుణం వచ్చినట్లు తమకు తోస్తున్నదని కార్మికమంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయ్ కార్మిక స్థాయీసంఘం 15 వ సమావేశం ప్రారంభిస్తూ చెప్పారు

కార్మికులు, యజమానుల మధ్య విరోధ భావాలు పోయి ప్రజల క్షేమం కోసం వస్తూత్పత్తికి ఐకమత్యంతో కృషి చేయాలని శ్రీ దేశాయ్ విజ్ఞప్తిచేశారు

కాలంచెల్లిన వర్గసంఘర్షణ భావాల నింక మరిచిపోయి సహకార కృషి ప్రారంభం కావాలన్నారు

సమాలోచనా విధానంవల్ల దేశంలో కార్మిక శాంతి సుస్థిరతలు, వస్తూత్పత్తి వృద్ధిచెందాయని శ్రీ దేశాయ్ చెప్పారు

సమాలోచనా విధానం రాణిలు, ఫలించటానికి చాలవరకు కార్మికులే బాధ్యులన్నారు

రెండో ప్రణాళిక నిర్వహణ చాలవరకు పారిశ్రామిక యజమానులు, కార్మికులు, సాంకేతిక నిపుణులపై ఆధారపడి ఉంటుందన్నారు

కార్మిక శాసనాలు కొల్లలుగా ఉన్నాయని విమర్శించేవారికి జవాబిస్తూ శ్రీ దేశాయ్, ప్రజాస్వామ్యంలో ఇటువంటి శాసనాలు కార్మికులకూ, యజమానులకూ మార్గంచూపేవే కాని అంతరాయాలు కావన్నారు. దేశంలో ...

## జోస్యాలు చెప్పించుకునే వారిదే ప్రమాదం

[illegible]

## నాయకుల నిర్ణయం, ముఖ్యమంత్రి తీర్మానం తెచ్చిపెట్టిన సందేహాలు

### ఆంధ్రప్రదేశ్ అనే పేరు తెలంగాణాకు బాగుంటుందా లేదా అని శ్రీ నరసింగరావు విచారణ

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

కర్నూలు, ఏప్రిల్ 6. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలను కలిపి 'కొత్త' రాష్ట్రం ఏర్పరచాలని తెలుగు నాయకులు ఏప్రిల్ 3 న చేసిన నిర్ణయం చట్టబద్ధమవుతే, కేంద్ర ప్రభుత్వం ఏదైనా మార్గాంతరం కనిపెట్టి, ఆంధ్ర ప్రాంతంలో ఎన్నికలు ప్రస్తుతానికి జరగకుండా ఆపుచేయవలసిఉంటుంది.

లేక, రాజ్యాంగం ప్రకారం 1960 లో ఎన్నికలు జరపవలసిఉంటుంది. ఆంధ్ర శాసనసభలో ముఖ్యమంత్రి, దీనిని కొత్త రాష్ట్రం అని పిలుస్తూ, 1962 లో ఎన్నికలు జరపాలని తీర్మానంలో చేర్చాన్నారు. ఇది అభ్యర్థనో లేక స్వతంత్రించి సూచిస్తున్న రాజ్యాంగ సవరణో అర్థం కావడం లేదు.

తెలంగాణం నుంచి 105 మంది సభ్యులు 196 మంది సభ్యులుగల ఆంధ్ర శాసనసభలో చేరతారు కాబట్టి, తెలంగాణా సభ్యుల సంఖ్య తిగినంత పెద్దదే కాబట్టి శాసనసభను రాష్ట్రాన్ని "కొత్త"దిగా చేర్చాలని కొందరి భావం.

కొత్తది కావాలి, ఎన్నికలూ వద్దు అనడం ఎలా పొంతనగల ప్రతిపాదన అవుతుందో అభిజ్ఞులు చెప్పలేకుండా ఉన్నారు

### సభాపతి ఒకసమస్యా?

ఒకవేళ ఆంధ్ర శాసనసభలో ఒక వర్గమూ, తెలంగాణాలో ఒక వర్గమూ కొత్త సభాపతిని ఎన్నుకోవడమే యీ కొత్తదనంలో ఆంతర్యం అనుకుంటే, ఉన్న సభాపతిని అడిగి తొలగించి, కొత్త ఎన్నిక జరిపించుకో వచ్చునని కొందరి భావం.

### ఆంధ్రప్రదేశ్: శ్రీ జె. వి. నరసింగరావు

"ఆంధ్రప్రదేశ్" అని ఈ కొత్త రాష్ట్రాన్ని పిలవాలని దాదాపు అందరూ ఒప్పుకున్నారు. హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నరసింగరావు "ఆంధ్రప్రదేశ్ అని పేరు పెట్టాలి అనేమాటనను" ...

ఇంకో నిర్ణయం మాత్రం న్యాయం కాదు.

### పేరుకంటే 'కొత్తదనం'

ఈలోగా, పేరుపైన మక్కువకంటే, కొందరు శాసన సభ్యులకు "కొత్త" రాష్ట్రం ఏర్పాటు వ్యవహారం చాలా ఆందోళన కలిగిస్తున్నది

నిన్న గాక మొన్న ఎన్నికలు జరిగి, మళ్ళీ 'కొత్త' రాష్ట్రం నిర్మాణంతో ఎన్నికల తతంగంలో పాల్గొనడంలో చాలా కష్టసాధ్యం అని వీరి అభిప్రాయం శాసనసభ్యుల్లో ఆవేశాలు ఈ విషయాలను ముఖ్యమంత్రికి నివేదించటానికి తయారవుతున్నారు

### 70 మంది శాసన సభ్యుల విజ్ఞప్తి

తెలంగాణా ప్రాంతం ఆంధ్రలో కలవగా విస్తృతమయ్యే రాష్ట్రాన్ని కొత్తరాష్ట్రంగా పరిగణించవద్దని, రాష్ట్రాలబిల్లుకు యీవిషయమై ప్రతిపాదించదలచిన సవరణను కొట్టివేయాలని కోరుతూ, శాసనసభ ఐక్య కాంగ్రెసు పార్టీలోని ... 70 మంది సభ్యులు, ముఖ్యమంత్రికి ఒక విజ్ఞాపన సమర్పించారు

... చేర్పగా ఏర్పడే రాష్ట్రాన్ని కొత్త రాష్ట్రంగా పరిగణించాలని యీ సభవారు సిఫార్సు చేస్తున్నారు" అని ఉన్నది

## అరబ్, ఇజ్రేల్ ఎల్లల స్థితి

### శ్రీ హమర్‌షెల్డ్ పరిశీలన

న్యూయార్క్, ఏప్రిల్ 4. అరబ్ రాజ్యాలకూ, ఇజ్రేలుకూ మధ్య సరిహద్దుల దగ్గర ఏర్పడ్డ ఉద్రిక్త పరిస్థితులను పరిశీలించేందుకు సమితి కార్యదర్శి శ్రీ హామర్‌షెల్డ్‌ని పంపేందుకు భద్రతామండలి నిశ్చయించింది ఆయన శుక్రవారంనాడు అక్కడికి బయలు దేరుతున్నారు ఆయనకు కావలసిన సహాయమంతా చేస్తామని ఈజిప్టు ప్రతినిధి భద్రతామండలిలో హామీ ఇచ్చారు

శ్రీ హామర్‌షెల్డ్‌ని అక్కడికి పంపాలన్న ప్రతిపాదన అమెరికా చేసింది ఆయన తీసుకునే చర్యల విషయమై ఆయన అరబ్ రాజ్యాలతోనూ, ఇజ్రేల్‌తోనూ కేవలం సంప్రదిస్తే చాలదని, వాటి ఆమోదం పొందాలనీ రష్యా ... ఆమోదంమీదనే జరగ్గలవన్న నమ్మకంతో తాను తీర్మానాన్ని బలపరుస్తున్నానని రష్యన్ ప్రతినిధి ప్రకటించారు తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదం పొందింది ఇజ్రేల్ కూడ ఆమోదించింది

## ఏలూరులో కొనుగోలు పన్ను రైతులపైనే!

### వర్తకులచే ధరల పాలన

(స్వకీయ విలేఖరి)

ఏలూరు, ఏప్రిల్ 2 ధాన్యం, బియ్యం పై కొనుగోలు పన్ను రైతులుమీద పడదని ప్రభుత్వం ప్రకటించింది. కాని, ఆ కొనుగోలు పన్ను విధింపు వార్త వెలువడగానే, ఆదివరకు పది హేను ఇరవై రోజులనుంచీ అక్కడ్లు ధాన్యం బస్తా రు 28 సన్నరకం కాటుకలు ధాన్య బస్తా రు 25 కూ కొంటున్న వర్తకులు వెంటనే వీని ధరలు బస్తా రు 0-12 0 తగ్గించి వేశారు

ధాన్యం అమ్ముకునే రైతుల మీదే ఈ కొనుగోలుపన్ను పడగలదని భయపడుతున్నారు

ఆహార పదార్థాల ధరలు అధికంగా పెరిగిపోతున్న ఈ తరుణంలో, ప్రభుత్వం ధాన్యం, బియ్యం, కొబ్బరి, పంచదార మొదలైన వానిమీద కొనుగోలు పన్ను విధించడంవల్ల ఈవరకే నలిగిపోతున్న మధ్యతరగతి ప్రజల జీవితం మరింత దుర్భరమైపోతుంది కనుక ఆంధ్రప్రభుత్వం దర్యాప్తు తీవ్రంగా విరమిస్తూ వెంటనే ఆహారపదార్థాలపై కొనుగోలు పన్ను ఉపసంహరించాలనీ, చౌకడిపోలు ఏర్పాటుచేసి ప్రజలకు ఆహారపదార్థాలు సరసమైన ధరలకు అందచేయాలనీ ప్రభుత్వాన్ని కోరుతూ, ఏలూరుసోషలిస్టుసంఘం తీర్మానించారు

సభా కార్యానికి శ్రీ మైనంపాటి శ్రీనివాసరావు అధ్యక్షత వహించారు.

## బుడమేరు రిజర్వాయర్ పథకం పరిశీలిస్తాము

### ముఖ్యమంత్రి హామీ

విజయవాడ, ఏప్రిల్ 4: ముఖ్యమంత్రి శ్రీ గోపాల రెడ్డి తమకు లోగడ బుడమేరు రిజర్వాయర్ విషయం అంతగా తెలియదనీ యిప్పుడు తెలుసుకుంటున్నాననీ, 9 వ తేదీన మంత్రివర్గ సమావేశంలో యీ విషయం చర్చకు రాగలదనీ ప్రజాభిప్రాయాన్ని మన్నించి, మంత్రివర్గంతప్పక సముచిత నిర్ణయం చేయగలదని, రైతు ప్రనిధులకు హామీ ఇచ్చారు.

ముఖ్యమంత్రి కృష్ణాజిల్లా పర్యటనలో, కైకలూరులో, గుడివాడ కైకలూరు గన్నవరం, విజయవాడ తాలూకాల రైతుల తరఫున పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘం కృష్ణాజిల్లా కిసాన్ సమ్మేళనం ఆంధ్రరాష్ట్ర కిసాన్ సమ్మేళనం తరఫున బుడమేరు రిజర్వాయరు ఆవశ్యకతను వివరంగా నివేదించుతూ ఒక విజ్ఞప్తిని సమర్పించారు.

## రాజాజీ రాజీనామా

మదరాసు, ఏప్రిల్ 5 శ్రీ సి రాజగోపాలాచారి మదరాసు శాసనసభా కాంగ్రెసుపక్షం సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణబిల్లు దానిపై ప్రభుత్వం వైఖరి బాగాలేదని ఎగువ శాసనసభలో ఆయన ప్రసంగించటానికి పూర్వమే, ఏప్రిల్ 1 వ తేదిని తన రాజీనామా లేఖను కాంగ్రెసు పక్షనాయకునికి పంపారని తెలుస్తోంది.

## కాందిశీకులకోసం పాక్ భూమిపరిహారం భారత ప్రభుత్వం అడుగుతుందా?

### వచ్చే కాశ్మీరు ఎన్నికలే జనవాక్యంగా పరిగణించే అవకాశం

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

న్యూఢిల్లీ, ఏప్రిల్ 3: ప్రధాని శ్రీ నెహ్రూ నిన్నటి పత్రికా సమావేశంలో తూర్పు పాకిస్తాన్‌నుంచి యావత్తు హిందూ జనాభానీ పాక్ అధికారులు తరిమివేస్తున్నారనే సందేహం ప్రకటించిన దానినిబట్టి, తూర్పు పాకిస్తాన్‌నుంచి భూభాగం ఇవ్వాలని భారతప్రభుత్వం కోరవచ్చుననే సూచన కనపడుతున్నదని కొందరిక్కడ ఊహిస్తున్నారు.

ఈవిధంగా భూభాగం తీసుకోవాలని ఇదివరలో ఇటువంటి పరిస్థితుల్లోనే స్వర్గీయ సర్దార్ పటేల్ సూచించారు

### భారత సరిహద్దుల్లో పాక్ విమానాశ్రయాలు

భారతికశరత్తునే అన్నిటికంటే ప్రధానం అమెరికామూలుఅప్యాయంగా పంపుతున్న ఆయుధ సహాయంతో పాకిస్తాన్‌లో భారత సరహద్దుల్లోనే కాకుండా, పాక్ ఆక్రమిత "ఆజాద్ కాశ్మీరు"లో కూడా పెద్దపెద్ద విమానాశ్రయాలు నిర్మిస్తున్నారు ఇది భారత దేశం భద్రతకే ప్రమాదంగా పరిణమించింది ఎందువల్లనంటే అప్పుడు ఇటునుంచి అట్లు ముస్లిములకూడా లేచిపోయారు

ఈతడవ ఆటునుంచి హిందువులే ఇక్కడికి వస్తున్నారు కాని, ఇక్కడినుంచి ముస్లిములు ...

ప్రధాని నెహ్రూ నిన్నటి పత్రికా సమావేశంలో మనస్సువిప్పి మాట్లాడారు విషయాలను స్పష్టంగా, అసందిగ్ధంగానూ, తోచినట్లు విప్పిచెప్పారు

పాకిస్తానీ ముస్లిం విలేఖరుల ప్రశ్నలకు జవాబులిస్తూ, కాశ్మీరు సమస్యలో ...

ఇంక జనవాక్య సేకరణేంక చోటులేదని నిర్మొహమాటంగా చెప్పేశారు పాకిస్తాను జాప్యంచేస్తూ, ఇంతవరకూ ఆడినసాటకం మూలంగానే భారతప్రభుత్వం ...

### వెనక లియాఖత్ అదుర్దా

[illegible]

## బాగ్దాద్‌కూటసభలో కాశ్మీరు జనవాక్యసమస్య

### చర్చకు ప్రతిపాదించాలని పాక్ విదేశాంగమంత్రి యత్నం

కరాచీ, ఏప్రిల్ 4: కాశ్మీర్‌లో జనవాక్యసేకరణ సమస్యపై భారత ప్రధాని శ్రీ నెహ్రూ ఇటీవల చేసిన ప్రకటనమీద బాగ్దాద్‌మండలి మంత్రులు టెహరాన్ సమావేశంలో చర్చించటం అవసరమని పాకిస్తాన్ విదేశాంగ మంత్రి శ్రీ హమీదుల్‌హక్ చౌదరి విలేఖరుల గోష్ఠిలో అన్నారు.

భారత ప్రధాని ప్రస్తావించిన అంశం బాగ్దాద్ మండలి ప్రాంతానికి సంబంధించింది కనుక, అది మండలి మంత్రులు చర్చించదగిన అంశమని ఆయన వాదించారు.

అయితే టెహరాన్ సమావేశంలో ఏ ఘట్టంలో ఏ రూపంలో ఈ సమస్యను ప్రస్తావించేదీ మాత్రం ఆయన ...

### తిరిగి సమితికి ప్రతిపాదన

[illegible]

విదేశాంగ శాఖల కార్యదర్శులు పాల్గొంటారు

### గోవాలో ప్రతినిధి కార్యాలయం?

గోవాలో ప్రతినిధి కార్యాలయాన్ని తిరిగి తెరవాలని పాకిస్తాన్ ...

### పాక్ ప్రధాని లేఖకు శ్రీ నెహ్రూ జవాబు

[illegible]



# రూ 107 కోట్లతో దుర్గాపూర్ ఉక్కు ఫ్యాక్టరీ

## బ్రిటిష్ కంపెనీల ప్రకటన

లండన్, ఏప్రిల్ 4 8 కోట్ల పౌన్ల ఖర్చుతో పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని దుర్గాపూర్‌లో ఉక్కు ఫ్యాక్టరీని తాము నెలకొల్పబోతున్నామని ఎనిమిది బ్రిటిష్ ఉక్కు సంస్థల కూటమి ప్రకటించింది. ఈ కూటమి పేరు ఇండియన్ స్టీల్ వర్క్సు కన్‌స్ట్రక్షన్ కంపెనీ.

దుర్గాపూర్ ఫ్యాక్టరీ నిర్మాణానికి భారత ప్రభుత్వం ఇచ్చిన కాంట్రాక్టు ఇంతవరకూ బ్రిటిష్ సంస్థలు సంపాదించిన అర్డర్లన్నిటిలోకీ పెద్దదని ఈ కంపెనీ ప్రకటించింది.

ఈ ఫ్యాక్టరీని ఈ కంపెనీ పూర్తిగా నిర్మించి భారత ప్రభుత్వానికి అప్పగిస్తుంది. దీని ఖర్చు మూలుగా అయితే, యంత్రసామగ్రిని బ్రిటన్ నుంచి అదేశం కొనుక్కుని, విదేశ అజ్మాయిషీ క్రింద తానే నిర్మించుకుంటుంది. ఈ ఫ్యాక్టరీ ఏడాదికి పదిలక్షలటన్నుల ఉక్కును ఉత్పత్తి చేస్తుంది. అవసరమయితే 20 లక్షల టన్నులను ఉత్పత్తి చేసేట్లుగా మార్చుకునేందుకు వీలు ఉంటుంది.

## మినికాయ్ దీపస్తంభం భారతస్వాధీనం

మినికాయ్ దీవి, ఏప్రిల్ 4 కొచ్చిన్ రేవుకు 200 మైళ్ల నైరృతి దిక్కుగా ఉన్న మినికాయ్ ద్వీపంలో బ్రిటన్ నెలకొల్పిన దీపస్తంభం నిన్న భారతప్రభుత్వానికి అప్పగింత పెట్టటం జరిగింది.

మినికాయ్ జగజాల దీవుల మీద 73 సంవత్సరాలక్రిందట ఈ దీపస్తంభాన్ని బ్రిటన్ నిర్మించింది. అరేబియా సముద్రంలో ప్రయాణం చేసే నౌకలకు ఈ దీపం చాలా ఉపయోగంగా ఉంటున్నది.

## పాశ్చాత్య రాజ్యాలపై ఫ్రెంచి ప్రధాని విమర్శ

పారిస్, ఏప్రిల్ 4. నేను 14వ ఫ్రెంచి ప్రధాని శ్రీ మొలే దూపొర్ పెళ్ళానికిముందుమున్న పాశ్చాత్య రాజ్యాలపై ఆయన చేసిన విమర్శ ఎంతయినా ఉద్రిక్తమైన సూచన అని రాజకీయ వర్గాలు భావిస్తున్నాయి.

శ్రీ మొలే ప్రశంసిస్తూ శ్రీ క్రుశ్చేవ్ చేసిన ప్రసంగం పట్ల వీరెవరూ అంత శ్రద్ధవహించడం లేదు. తాను ప్రధానిగా వున్నంతకాలం లేదా ఫ్రెంచి సోషలిస్టు పార్టీ నాయకుడుగా వున్నంతకాలం కమ్యూనిస్టులతో ఐక్యసంఘటన నెలకొల్పే ప్రసక్తి లేదని శ్రీ మొలే చెప్పిన దానిపై రష్యన్ నాయకులు వ్యాఖ్యానించకపోవడం లేదన్న విషయాన్ని కూడా వీరు శ్రద్ధగా గుర్తిస్తున్నారు.

## మలయాలో కల్లోలాలు సాధ్యం

### అవసరమైతే బ్రిటిష్ సేనల సహాయం

సింగపూర్, ఏప్రిల్ 4: సింగపూర్ కు స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత తీవ్రమైన అంతరంగిక కల్లోలాలు బయలుదేరితే వాటిని అణచివేయడానికి బ్రిటిష్‌సేనల సహాయం అర్థించక తప్పదని ప్రధాని డేవిడ్ మార్షల్ నేడు శాసనసభలో చెప్పారు. ఈ సంగతి యీ నెలలో జరిగే లండన్ చర్చల సందర్భంలో కూడా ప్రస్తావిస్తామని అన్నారు. అవసరమయ్యే పక్షంలో దేశంలోని రక్షణ స్థావరాలను రక్షించేందుకుకూడా ఒక పథకం రూపొందించే ఏర్పాటు చేసుకోవలసి వుంటుందన్నారు.

## వలసవాదపు ఓటమి

### ప్రస్తుత చరిత్రలో ముఖ్యఘట్టం

హాంకాంగ్, ఏప్రిల్ 4 ప్రస్తుత ప్రపంచ చరిత్రలో గణనీయమైన ప్రముఖఘట్టం, వలసవాద ఓటమి అని సోవియట్ ఉపప్రధాని శ్రీ మికోయాన్ నిన్న 150 వేలమంది హాజరైన హానోయ్ సభలో చెప్పారని హానోయ్ రేడియో ప్రకటించింది.

భారత, బర్మా, ఈజిప్టు ప్రజలు స్వాతంత్ర్యసాధన తరువాత దానిని సుస్థిరం చేసుకోవడానికి, శాంతిస్థాపనకు చేస్తున్న కృషిని మికోయాన్ ప్రశంసించారు. శాంతి ప్రాంతం విస్తరిస్తున్నందుకు శాంతికాముకుల సంఖ్య బలపడుతున్నందుకు హర్షం వెల్లడించారు. వియత్నాం ఏకీకరణ విషయంలో జనీవా ఒప్పందాన్ని అభివృద్ధి నిరోధకశక్తులు భగ్నం చేస్తున్నాయని విమర్శించారు. బాగ్దాద్, మనిలా, సంధులు శాంతికి ప్రమాదమన్నారు.

## బొంబాయి మార్కెట్

బొంబాయి, ఏప్రిల్ 5

| | |
|---|---|
| వెండి (100 తు) | 180-10 0 |
| బంగారం తులం 1 కి | 105-0 0 |
| నవరను | 66-6-0 |
| వేరుశెనగ విత్తులు | 34 8-0 |
| ఆవిసె విత్తులు | 33 2-0 |
| ఆవిసె నూనె | 21-3-0 |
| ఆముదం విత్తులు | 27-8-0 |
| వేరుశెనగ నూనె మణుగు | 18-12-0 |
| సైగర్ విత్తులు | 29-0-0 |



## అనంతశయనంగారికి సన్మానం

ఢిల్లీ, ఏప్రిల్ 1 లోక్‌సభ సభాపతిగా ఎన్నికయిన శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగారికి మార్చి 30వ తేదీన ఢిల్లీ ఆంధ్రసంఘం సన్మానం చేశారు. కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ అధ్యక్షత వహించారు. ఉత్పత్తిశాఖ మంత్రి శ్రీ కె సి రెడ్డి, సుప్రీంకోర్టు న్యాయమూర్తి, శ్రీ బచ్చు జగన్నాథదాసు, శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్, శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు, కేంద్ర జలవిద్యుత్ సంఘం సభ్యులు శ్రీ డా॥ కె యల్ రావు, చాలామంది పార్లమెంటు సభ్యులు వచ్చారు. సంఘం ఉపాధ్యక్షులు శ్రీ అబ్దుల్ ఖాదర్ స్వాగతించెప్పారు. శ్రీ పన్యాల రంగనాథరావు, శ్రీ అయ్యంగారికి సన్మానపత్రం సమర్పించారు.

శ్రీ దేశముఖ్ ప్రసంగిస్తూ రాబున్న సంవత్సరం పంచవర్షప్రణాళిక దృష్ట్యా చాలా ముఖ్యమైందని, దేశం అభివృద్ధి అంతా పార్లమెంటు సభలో వున్నదనీ అన్నారు. అనంతశయనంగారు చాలాకాలంనుంచి సభాపతి బాధ్యతలను నిర్వహిస్తూ వచ్చారని, వారు ఇప్పుడు సభాపతి అవడం ఎంతో సహజమనీ అన్నారు. అనంతశయనంగారి గుణగణాలను ప్రశంసిస్తూ వారిని అజాతశత్రువని శ్లాఘించారు. "వీరి ఎన్నికవల్ల ఆంధ్రులందరికీ కలిగే ఆనందం నాకు తెలుసు, నేను వారికి బంధువును" అని శ్రీ దేశ్‌ముఖ్ అనగా సభలో హర్షధ్వానాలు చేశారు.

కుమారి టి వి జలనిబృందం, భరతనాట్యం చేశారు. సంఘంతరపున కుమారి నళినికి శ్రీ దేశ్‌ముఖ్ రజత పాత్రను బహూకరించారు.

ఈ సంవత్సరం రిపబ్లిక్ దినోత్సవాలలో ఆంధ్రరాష్ట్రం తరఫున, ఢిల్లీ ఆంధ్రసంఘం నిర్వహించిన నాగార్జునసాగరం ప్రదర్శనలలో పాల్గొన్న వారికి, కేంద్రరక్షణశాఖ ఇచ్చిన బహుమతులను శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ ఇచ్చారు.

వందన సమర్పణ చేస్తూ శ్రీ వి వేదాంతం, కేంద్ర జలవిద్యుత్ సంఘంలో సభ్యులుగా నియమితులైన డా॥ కె యల్ రావును అభినందిస్తూ వారిని "యోజనవిధాత" అని ప్రశంసించారు.

## పశుగ్రాసం ఉత్పత్తి

### అభివృద్ధికోసం విచారణ

మదరాసు, ఏప్రిల్ 4 ఆంధ్రరాష్ట్రంలో పశుగ్రాస అభివృద్ధికి, పచ్చిక బయళ్ళ ఏర్పాటుకు అవసరమైన సలహాలిచ్చి పశుగణాభివృద్ధికి సహాయపడేందుకు ప్రభుత్వం యీమధ్య ఒక సలహా సంఘాన్ని నియమించింది.

ఈ సంఘానికి వ్యవసాయ మంత్రి శ్రీ కందుల ఓబులరెడ్డి అధ్యక్షులు. రివిన్యూబోర్డు ప్రథమ సభ్యుడు శ్రీ కే యం. ఉన్నితన్ ఉపాధ్యక్షుడు. అటవిక శాఖ కన్సర్వేటరు శ్రీ యస్ టి సహాని, వ్యవసాయశాఖ డైరక్టరు శ్రీ ఐ కే నాయుడు, పశుగణాభివృద్ధి శాఖ డైరక్టరు మేజరు టి మురారి, చీఫ్ ఇంజనీరు శ్రీ యల్. వెంకట కృష్ణయ్యర్, రాష్ట్రవనపోషణ శాస్త్రవేత్త శ్రీ యం యస్ రాఘవన్, సీనియర్ ఫారెస్టు ఆఫీసరు శ్రీ సి. శ్రీనివాసరావు, శ్రీ వి. కోదండరామారెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సాంఖ్యిక శాస్త్రాధ్యాపకుడు. శ్రీ వి జె దాసారావు, రెవిన్యూబోర్డు సంయుక్తకార్యదర్శి శ్రీ డి ధనసింగ్ (కార్యదర్శి) సభ్యులు.

ప్రభుత్వ ఆధీనంలో ఉండే బంజరు భూములనుగురించి పరిశీలన జరిపి వాటిల్లో పశుగ్రాస ఉత్పత్తికి రేవు తగునో యే స్థలాల్లో పచ్చిక బయళ్లను వేయవచ్చునో ఆలోచించడం యీ సంఘ ముఖ్యలక్ష్యం.

పశుగ్రాస ఉత్పత్తికి పచ్చిక బయళ్ళకు అవసరమైన భూములను నిర్ణయించి, వాటి అభివృద్ధి నిర్వహణకు ఏర్పాటుచేసి ఉంచడం మంచిది అనేసంగతి పరిశీలించి కూడా యీ సంఘం ప్రభుత్వానికి సలహా యివ్వవలసి ఉంది.

## ఐక్యతాభివృద్ధికి ద్విభాషా రాష్ట్రాలు

### మైసూరు శాసనసభల తీర్మానం

బెంగుళూరు, ఏప్రిల్ 4 వివిధ ప్రాంతాల సర్వతోభివృద్ధికి సమధి కోత్సాహంతో దేశంలో కృషిజరుగుతున్న ప్రస్తుత పరిస్థితులలో జాతి ఐక్యమత్యాన్ని పెంపొందించి, సుస్థిర శాంతిభద్రతలను నెలకొల్పడానికి అనుగుణంగా ప్రాంతీయ మండలితో సాధ్యమైన ప్రాంతాలలో ద్విభాషారాష్ట్రాలను ఏర్పాటుచేయడం అవసరమనే తీర్మానాన్ని మైసూరు శాసనసభ — శాసనసభా కౌన్సిల్ చాలా వోట్లతో నేడు ఆమోదించినవి.

ఈ ప్రత్యేక తీర్మానాన్ని రాష్ట్ర ప్రభుత్వం తరఫున ముఖ్యమంత్రి శ్రీ కె హనుమంతయ్య ప్రతిపాదించారు. శాసనసభలో తీర్మానాన్ని సభాపతి వోటును మినహా కాంగ్రెసు సభ్యులందరు ఏకగ్రీవంగా బలపరిచారు. ప్రజాసోషలిస్టుపార్టీ సభ్యుడు, కమ్యూనిస్టు సభ్యుడు తీర్మానానికి వ్యతిరేకంగా వోటు చేశారు.

ఎగువ సభలో న్యాయశాఖమంత్రి శ్రీ ఎ జి రామచంద్రరావు తీర్మానాన్ని ప్రతిపాదించారు. తీర్మానానికి వ్యతిరేకంగా ముగ్గురు సభ్యులు ప్రసంగించారు.

ప్రత్యేక కర్ణాటక రాష్ట్రం కావాలనేవారికి, వద్దు అనేవారికి రాజీగా ఈ తీర్మానం ఉన్నదని తీర్మానాన్ని బలపరిచినవారు అంగీకరించారు. ప్రత్యేక కర్ణాటక రాష్ట్రంవద్దు అని వాదించేవారు భాషా ప్రాతిపదికపైన రాష్ట్రాలను ఏర్పాటు చేయడాన్ని వ్యతిరేకిస్తున్నారు. అయితే ద్విభాషా రాష్ట్రాలకు బహుభాషా రాష్ట్రాలకు వీరు అనుకూలురు.

అల్పసంఖ్యాకుల కోపతాపాలు, నిరాశ నిస్పృహలు రాజకీయాలకు ప్రమాదకరం కనుక వారి అభిప్రాయాలనుకూడా మన్నించడం అవసరమని తీర్మానాన్ని ప్రతిపాదించుతూ ముఖ్యమంత్రి శ్రీ హనుమంతయ్య శాసనసభలో అన్నారు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లును సభ ప్రశాంతంగా ఆమోదించి కొత్త మైసూరు రాష్ట్రం వడిదుడుకులేమీ లేకుండా ఏర్పడ్డానికి తోడ్పడే ఉద్దేశంతోనే చాలావరకు ఈ తీర్మానాన్ని ప్రతిపాదించామన్నారు.

ఆ తరువాత చర్చకు సమాధానం చెబుతూ తీర్మానాన్ని విరమించుకోమని కోరుతూ తనకు చాలా తంతి అభ్యర్థనలు వచ్చినవని ముఖ్యమంత్రి చెప్పారు. ద్విభాషా రాష్ట్రాన్ని ఏర్పాటు చేసే ప్రతిపాదనను ఉత్తర కర్ణాటక ప్రజలు వ్యతిరేకించుతున్నమాట నిజమేనన్నారు. కర్ణాటక రాష్ట్రమే వారి కోరిక అని చెప్పారు. అఖిలభారత కాంగ్రెసు తీర్మానానికి అనుగుణంగానే తాము ఈ తీర్మానాన్ని ప్రతిపాదించామని వివరించారు. ఇంకా ఇట్లా అన్నారు "మైసూరు రాష్ట్ర సమష్టి స్వరూపాన్ని చెడగొట్టరాదని గత మూడు మూడు సంవత్సరాలుగా నేను చెబుతూవచ్చాను. కేవలం భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలను ఏర్పాటు చెయ్యాలని నేను ఎన్నడూ అనలేదు. ఏకభాషా రాష్ట్రానికి అనుకూలంగా సభలోకూడా ఎన్నడూ వోటు చేయలేదు."

"ఈనాడైనా ఇప్పుడున్న మైసూరు రాష్ట్రం, ఇకముందు ఏర్పడబోయే మైసూరురాష్ట్రం, ద్విభాషా రాష్ట్రాలుగానే ఉండగలవుగాని ఏకభాషా రాష్ట్రం కాదని స్పష్టంగా మరోసారి చెబుతున్నాను. అందువల్ల నేనేదో మారిపోతున్నానని నిందించి ప్రయోజనం లేదు. నేనేమీ విచిత్రంగా మారలేదు. ఈ సభ ఆదేశాలను మెల్లిమెల్లిగా అమలు చేస్తున్నాను. అంతే 'దక్షిణ ప్రదేశ్' అనే అభిప్రాయమొకటి చర్చకువచ్చింది. ఆ అభిప్రాయానికి రూపమిచ్చి ఈ తీర్మానం తెచ్చాం. సభ ఆమోదిస్తారని ఆశిస్తున్నాను."

ప్రత్యేక కర్ణాటకరాష్ట్రం కావాలనివాదించేవారిలో ముఖ్యుడైన ముఖ్యమంత్రి ఇప్పుడు అకస్మాత్తుగా అభిప్రాయం మార్చుకొని ఈ తీర్మానాన్ని ప్రతిపాదించారని తీర్మానాన్ని వ్యతిరేకించుతూ ప్రజాసోషలిస్టు పార్టీ సభ్యుల నాయకుడు శ్రీ మహమ్మద్ ఇమామ్ విమర్శించారు. ఇంకా ఇట్లా అన్నారు:

"ద్విభాషా, త్రిభాషా రాష్ట్రాలను ఏర్పాటు చేస్తే వాటివల్ల దేశ ఐక్యత పెంపొందేబదులు అనైక్యతను ఎక్కువ చేసే ప్రమాదం ఉన్నది. అంతఃకలహాలకు దారితీస్తవి. ఏకభాషా రాష్ట్రమంటే భయపడవలసిన అవసరమేమీ లేదు. పైగా ఇటువంటి రాష్ట్రాలు మన దేశానికి కొత్తకాదు. ఏకభాషా రాష్ట్రాలను ఉత్తర ప్రదేశ్, బెంగాల్, పంజాబ్, బీహార్ రాష్ట్రాలు నిదర్శనాలు. అవి చక్కగా పనిచేస్తున్నవి. దేశ నాయకులలో ఎక్కువ మంది ఆ రాష్ట్రాలవారే. అందువల్ల ఏకభాషా రాష్ట్రాలవల్ల దేశ ఐక్యతకు చేటు వస్తుందనడంలో అర్థంలేదు."

"ద్విభాషా, త్రిభాషా రాష్ట్రాలు కూడా చాలా ఉన్నవి. తమను నిర్లక్ష్యం చేస్తున్నారని అక్కడి అల్పసంఖ్యాక వర్గాలు ఎప్పుడూ ఫిర్యాదు చేస్తూనే ఉన్నారు. దక్షిణ ప్రదేశ్ ను ఏర్పాటుచేయడం చాలా ప్రమాదమని హెచ్చరిస్తున్నారు. నాలుగు రాష్ట్రాలూ కలిసి ఒక్క మాట అనుకుని కేంద్రాన్ని ఎదిరించితే చాలా ప్రమాదాలు వస్తవి, దేశ ఐక్యత దెబ్బతింటుంది. చిన్నచిన్న రాష్ట్రాలైతే అటువంటి ప్రమాదం రాబోదు."

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుకు వచ్చిన రెండు సవరణలను శాసనసభ నేడు ఆమోదించి, మరి రెండు సవరణలను నిరాకరించారు. కొత్తమైసూరు రాష్ట్రంలో ఎగువసభను రద్దు చేయాలన్నది సభ నిరాకరించిన సవరణలలో ఒకటి.

బిల్లులోని 26వ నిబంధనకు ముఖ్యమంత్రి తెచ్చిన సవరణను సభ ఆమోదించారు. చట్టం అమలులోకి వచ్చిన తరువాత కూర్గు శాసనసభ యిప్పటి సభ్యులు తమలో తాము ముగ్గుర్ని కొత్త రాష్ట్ర శాసనసభకుఎన్నుకోవాలనియీ సవరణ కోరుతున్నది. కూర్గు జిల్లా నుంచి ఆ ముగ్గురు శాసనసభకు ఎన్నికైనట్లు పరిగణించాలని సవరణ సూచిస్తున్నది.

ఈ సవరణను వివరించుతూ ముఖ్యమంత్రి ఇట్లా చెప్పారు "రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లు ప్రకారం ప్రస్తుత కూర్గు శాసనసభ 24 గురుసభ్యులు కొత్త మైసూరు శాసనసభ సభ్యులవుతారు. మైసూరురాష్ట్రంలో ఒక తాలూకాకంటే కొంచెం పెద్దప్రాంతమైన కూర్గుకు ఇంత ఎక్కువ ప్రాతినిధ్యమివ్వడం న్యాయంకాదు. అందుకని ఈ సవరణ తెచ్చాం. ఈ అభిప్రాయాన్ని భారత ప్రభుత్వము, కూర్గు శాసనసభ సభ్యులూ ఆమోదిస్తారని ఆశిస్తున్నాను."

అంతలో శ్రీ ఇమామ్ కలిపించుకుని ఒకసారి శాసనసభకు ఎన్నికైన సభ్యులు ఐదు సంవత్సరాలవరకు పదవిలో ఉంటారు కనుక ఈ సవరణను అమలు జరపడం సాధ్యంకాదన్నారు.

అందుకుసమాధానంగా అసలు కూర్గ రాష్ట్రమునేది ఇకముందు లేకుండా పోతున్నది కనుక ఇప్పటి పద్ధతిలోనే ఆ రాష్ట్ర శాసనసభ సభ్యులు పదవిలోవుండే అవకాశం లేదని ముఖ్యమంత్రి చెప్పారు. కూర్గులోని ఇప్పటి పద్ధతులను మైసూరురాష్ట్రంలోని పద్ధతులను అనుగుణంగా మార్చడం అవసరమన్నారు.

## ఆర్. యం. డి. సి. ఫిర్యాదు

బెంగుళూరు, ఏప్రిల్ 4 కేంద్ర చట్టం ఈ నెల 1 నుంచి అమలులోకి వచ్చినందున తమ పజిల్స్ పోటీలను తాత్కాలికంగా నిలిపివేస్తున్నట్లు ఆర్ యం డి సి నిర్వాహకులు ప్రకటించారు. ఇతర పజిల్స్ సంస్థల వారితోబాటు సుప్రీంకోర్టులో యీ చట్టానికి వ్యతిరేకంగా ఫిర్యాదు చేయదలచుకున్నట్లు తెలియజేశారు.

## పంచాయతీ ఎన్నికలు

ఒంగోలు, ఏప్రిల్ 4 ఈ తాలూకాలో, 122 పాత పంచాయతీలకు, 20 కొత్తపంచాయతీలకు, నిన్న టినుంచీ ఎన్నికలు ప్రారంభమైనవి. ఎన్నికలు పూర్తి అయ్యేసరికి నాలుగైదు నెలలు పట్టవచ్చు.

# అమలాపురం ప్రాంతంలో ఇన్ని హైస్కూళ్లు అవసరమా?

## కొన్నింటిని మూసివేయవచ్చునా అని పురపాలక సంఘానికి లేఖ

కర్నూలు, ఏప్రిల్ 4 ఉన్నత పాఠశాలను అమలాపురం పురపాలక సంఘం నిర్వహణలోకి మార్చి, మురమండ, గొల్లప్రోలు, దంగేరు, రావులపాడు, పెద్దాపురప్పాడు, మురారీలలోని ఉన్నత పాఠశాలలను మూసివేసే విషయమై ఆ పురపాలక సంఘం అభిప్రాయం తెలుసుకోమని తూర్పు గోదావరిజిల్లాబోర్డు ప్రత్యేకాధికారిని ఆంధ్ర ప్రభుత్వం కోరింది. ఈ పాఠశాలల్లో తగినంతమంది విద్యార్థులు లేరు. వాటికి సమీపంలోనే ఇతర ఉన్నత పాఠశాలలున్నవి కనుక పైన వివరించిన గ్రామాలలోని ఉన్నత పాఠశాలలను ఇకముందుకూడా ఉంచడం అనవసరమని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది.

జిల్లాబోర్డు ఆర్థిక స్థితిగతుల పరిశీలనకు నియమించిన ప్రత్యేకోద్యోగి శ్రీ వాసుదేవన్ చేసిన సూచనను ఆమోదించి మురారి మొదలైన గ్రామాలలో హాయర్ ఎలిమెంటరీ పాఠశాలలను నెలకొల్పి, కోరుకొండలోని ఉన్నత పాఠశాలలో తగినంతమంది విద్యార్థులు లేరు కనుక దానిని మాధ్యమిక పాఠశాలగా మార్చే విషయం పరిశీలించమని ప్రభుత్వం ఉత్తరువు చేశారు.

ప్రత్యేకాధికారి ఈ సూచనలను ఆమోదించేటట్లయితే వేసవి సెలవులకు పాఠశాలలను మూసివేసేలోగానే ఆయా గ్రామాల ప్రజలకు విద్యార్థులకు ఆ సంగతి తెలియ చెయ్యాలి.

పాఠశాలను మూసివెయ్యాలని ప్రత్యేకాధికారి నిర్ణయించిన ప్రాంతంలో ఏదైనా ఒక పాఠశాలను ఇకముందు కూడా ఉంచాలని గ్రామస్థులు కోరినట్లయితే లోగడ చేసిన వాగ్దానాలను నెరవేర్చడమేకాక పాఠశాల పాలనపరి ఖర్చు కూడా గ్రామస్థులు జిల్లాబోర్డుకు ముందుగా చెల్లించాలి. ఎంత చెల్లించవలసినదీ ప్రత్యేకాధికారి నిర్ణయించాలి. ప్రత్యేకాధికారి నిర్ణయించే గడువులోగా సొమ్ము చెల్లించాలి.

సెకండరీ పాఠశాలల్లో మొదటిఫారం నుంచి మూడవ ఫారం వరకు నెలకు 4 అణాలు, నాల్గవఫారం నుంచి నెలకు 8 అణాలు రుసుం ఎక్కువ చెయ్యాలనే సిఫార్సును పరిశీలించి వచ్చే జూన్ నుంచి తగు ఏర్పాట్లు చేయమని ప్రత్యేకాధికారిని ప్రభుత్వం కోరారు.

### సెకండరీ విద్యకు పంచాయతీల విరాళం

సెకండరీ విద్య ఖర్చుకు పంచాయతీలు ఇచ్చిన విరాళం అందుకు అవసరమైన అనుమతి ముందుగా పొంది ఇచ్చారో లేదో కనుక్కోమని ప్రత్యేకాధికారిని ప్రభుత్వం కోరారు. ప్రభుత్వం వద్దనుంచి స్పష్టంగా ఉత్తరువులు రానిదే వాగ్దానం చేసిన విరాళాలను ఇవవద్దని పంచాయతీలకు ప్రభుత్వం తెలియచేశారు.

అమలాపురంలోని కాటవారల విశ్రాంతి మందిరాలను పురపాలక సంఘమే నిర్వహించాలని ప్రభుత్వం ఆదేశించారు. ఈ విషయమై పురపాలక సంఘంతో వెంటనే వ్యవహారం జరపమని జిల్లా బోర్డు ప్రత్యేకాధికారిని కోరారు. మిగతా విశ్రాంతి మందిరాలను రహదార్ల శాఖకు మార్చే విషయమై ప్రభుత్వానికి ప్రత్యేకాధికారి వ్రాయాలి. జిల్లాబోర్డు నిర్వహణలోని సత్రాలను పంచాయతీ బోర్డులకు మార్చే విషయమై స్థానిక పరిపాలనాశాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్‌కు ప్రత్యేకాధికారి వ్రాయాలి.

ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు ఇచ్చే ప్రత్యేక వేతనాలను ఇకముందు ఆపివెయ్యాలనే సూచనను ప్రభుత్వం ఆమోదించలేదు.

### ఆసుపత్రుల ఖర్చు

సామర్లకోట, బిక్కవోలు, మండపేట, ధవళేశ్వరం, యేలేశ్వరం, ముమ్మిడివరం, ద్రాక్షారామ, పెదపూడి, అనపర్తి, పందల పాకలలోని ఆసుపత్రుల నిర్వహణాధికారాన్ని మార్చే విషయమై వైద్యశాఖ డైరక్టరుకు, లేదా దేశీయ వైద్యశాఖాధికారికి వ్రాయమని జిల్లాబోర్డు ప్రత్యేకాధికారిని ప్రభుత్వం ఆదేశించారు. అట్లా మార్చడానికి గ్రామ పంచాయతీలు అభ్యంతరం చెప్పేటట్లయితే ఆ యా ఔషధశాలల ఖర్చును గ్రామ పంచాయతీలే భరించే ఏర్పాటు చెయ్యాలి. పిఠాపురంలోని ఆసుపత్రిని ప్రభుత్వం తన నిర్వహణలోకి తీసుకోవడం సాధ్యంకాదు.

అయితే ఆ ఆసుపత్రిఖర్చులో కొంత పంచాయతీ బోర్డు భరించేట్టు చెయ్యాలి. స్థానిక పరిపాలనా శాఖ ఇన్‌స్పెక్టరు జనరల్‌తో ఈ విషయమై వ్యవహారం జరపాలి.

అదే విధంగా ప్రసూతి శిశు సంరక్షణాలయాల నిర్వహణనుకూడా పంచాయతీలకు మార్చే విషయమై కూడా స్థానిక పరిపాలనా శాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్‌తో వ్యవహారం జరపాలి. వాటి నిర్వహణను తీసుకోనడానికి పంచాయతీలు సమ్మతించక పోతే వాటి నిర్వహణ ఖర్చులో పంచాయతీలు కొంత భరించే ఏర్పాటు చెయ్యాలి.

ఇప్పుడు పంచాయతీ బోర్డులు లేని గ్రామాలకు త్వరలో వాటిని ఏర్పాటు చేయనున్నారు. గనుక అటువంటి ప్రాంతాలలో ప్రమాదకరమైన, చట్టవిరుద్ధ వ్యాపారాలు చేసేవారికి ప్రభుత్వం అనుమతులను ఇచ్చే పద్ధతిని ఆపు చేయడం మంచిదవునో కాదో తెలియజేయమని కూడా జిల్లా బోర్డు ప్రత్యేకాధికారిని ప్రభుత్వం కోరారు. ఈ అనుమతులు ఇచ్చేందుకు ఏర్పాటు చేసిన ఇన్‌స్పెక్టర్లు, రెవిన్యూ అధికారి, జవాన్లకు ముందుగా తెలియచేసి తీసివేస్తే బాగుంటుందేమో చెప్పమని కూడా ప్రభుత్వం కోరారు.

### రోడ్ల నిర్వహణ ఖర్చు

బడ్జెట్‌లో తిరుగుదలరాకుండా ఉండడానికి వీలుగా రోడ్లనిర్వహణ ఖర్చును రూ 6 లక్షలకు పరిమితం చేయమని జిల్లాబోర్డుకు ప్రభుత్వం సూచించారు. కొత్తపంచాయతీలు ఏర్పడనున్నవి కనుక జిల్లాబోర్డు ఆదాయం ఇంకా తగ్గేఅవకాశం ఉన్నది. అందువల్ల డబ్బు ఖర్చయ్యే కొత్తపను లేమీ తలపెట్టవద్దని సలహా చెప్పారు.

భూమి సెస్సులో జిల్లాబోర్డులకు ఇప్పటికంటే ఎక్కువ వాటా ఇవ్వాలని, ఆస్తుల లావాదేవీల సందర్భంలో పంచాయతీ ప్రాంతాలలో వసూలు చేసే సుంకంలో ఇప్పటికంటే ఎక్కువ వాటా జిల్లాబోర్డులకు ఇవ్వమని కూడా శ్రీ వాసుదేవన్ సూచించారు. జిల్లాబోర్డుల ఆదాయం ఎక్కువ కావడానికి వీలుగా సెకండరీ విద్యకు ఎక్కువ ధనసహాయమివ్వమని శ్రీ వాసుదేవన్ సూచించారు. ఇందుకు ప్రభుత్వవిధానాన్ని సవరించడం, చట్టంచేయడం అవసరం కనుక ఈ సూచనలపై ప్రభుత్వం వేరే ఉత్తరువులు జారీచేస్తారు.

# క్రీడారంగం

## ప్రపంచ టేబుల్ టెన్నిస్

టోక్యో, ఏప్రిల్ 4.

మూడు రోజులనుంచీ జరుగుతున్న ప్రపంచ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ టీమ్ పోటీలలో ఇప్పటికి ఈ వేళ భారత ప్రతినిధులు రెండు పోటీలు గెలిచారు. స్వేత్లింగ్ కప్పు పోటీలలో (పురుషుల టీం ఛాంపియన్‌షిప్) ఇండియా ఈ వేళ దక్షిణ కొరియాను (5-2) అమెరికాను (5-4) ఓడించింది. ఇండియా ఈ పోటీలలో జెకోస్లవేకియా, ఇంగ్లండ్, వియత్నాంల చేతిలో ఓడిపోయింది. ఇంకా రెండు పోటీలలో ఆడవలసి వున్నది.

స్వేత్లింగ్‌కప్ పోటీలలో ఇప్పటికి జపాన్ (ప్రస్తుత ఛాంపియన్), జెకోస్లవేకియా (ప్రస్తుత రన్నర్ అప్) లు మాత్రమే ఒక్క పోటీలో కూడా ఓడకుండా ఉన్నవి. నిన్నటివరకూ ఓడకుండా వస్తున్న ఇంగ్లండ్, రుమేనియా, జర్మనీలు ఈ వేళ పోటీలలో ఓడిపోయినవి. శేష గ్రూప్ ఫైనల్సులో జపాన్ స్వీడన్‌తోనూ, జెకోస్లవేకియా అమెరికాతోనూ పోటీ చేయవలసి వున్నది. వీటిలో ఏదయినా ఓడితే రుమేనియా, ఇంగ్లండు, జర్మనీలలో ఏదయినా ఫైనల్సుకు రావచ్చు. ఈ వేళ జపాన్ రుమేనియానూ, జెకోస్లవేకియా ఇంగ్లండునూ, జపాన్ జర్మనీనీ ఓడించినవి.

స్త్రీల ఛాంపియన్‌షిప్ కార్బిలాన్ కప్ పోటీలలో ఈ వేళ కూడా ఇండియా విజయం సాధించలేక పోయింది. ఇంతవరకూ ఈ పోటీలలో ఓటమిలేకుండా ఉన్న జపాన్‌ని ఇంగ్లండ్ ఓడించింది. ఇప్పటివరకూ ఇంగ్లండు ప్రస్తుత ఛాంపియన్ అయిన రుమేనియా మాత్రమే ఈ పోటీలలో ఓటమి లేకుండా ఉన్నవి. అయితే శేషం ఈ రెండింటికీ పోటీ ఉన్నది కనుక, జపాన్ ఈ ఫైనల్సులో కూడా ప్రవేశించే అవకాశం ఉన్నది.

---

న్యూఢిల్లీ, ఏప్రిల్ 4 భారతదేశంలో బ్యాంకులు సాధారణంగా పాకిస్తాన్ రూపాయి నోట్లను కొనడంలేదు. వాటికి గిరాకీ లేకపోవడమే యిందుకు కారణం. పాక్ రూపాయి విలువ మారకం రేటుకన్నా చాలా తక్కువ అని ఆర్థికశాఖ ఉపమంత్రి శ్రీ బలిరాం భగత్ లోకసభలో డా॥ సత్యవాది ప్రశ్నకు సమాధానంగా తెలియజేశారు.

---

మాడ్రిడ్, ఏప్రిల్ 4: మొరాకో భవితవ్యంపై చర్చలు జరపడానికి వచ్చిన మొరాకో సుల్తాన్ సిదీ మహమద్ బెన్ యూసఫ్‌కు స్పానిష్ నాయకుడు ఫ్రాంకో యితర మంత్రివర్గ సభ్యులు స్వాగతమిచ్చారు. మొరాకో ఏకీకరణ సమస్యపై వీరు తుది నిర్ణయాలు చేస్తారని భావిస్తున్నారు.

